# ప్రతిదీ రెండు-రెండు

## చైనా జానపద కథ



# ప్రతిదీ రెండు-రెండు

హక్‌టక్ తన తోటలో తవ్వుతున్నప్పుడు ఒక రాగి గుండిగ దొరికింది. అది ఎలా ఉపయోగపడుతుందో అతడికి తెలియలేదు. ఇంటికి వెళ్లేటప్పుడు హక్‌టక్ ఆ గుండిగలో తన డబ్బు సంచి ఉంచాడు. అందులో కొన్ని నాణాలు ఉన్నాయి.

హక్‌టక్ భార్య పక్కపిన్ను పొరపాటున ఆ గుండిగలో పడిపోయింది. దానిని ఆమె తీసుకున్నప్పుడు ఆ పాత్ర రహస్యం బయటపడింది. పక్కపిన్నే కాదు డబ్బు సంచులు కూడా రెండు ఉన్నాయి – అంటే నాణాలు రెట్టింపు అయ్యాయి! దాంతో హక్‌టక్ దంపతులు చాలా సంతోషించారు. గుండిగతో ప్రతిదీ రెండేసి అవుతాయి. ఇక వాళ్ల పేదరికం తొలగిపోయినట్లే.

అయితే ఏ మహిమ అయినా దానితోపాటు సమస్యలను కూడా తెచ్చిపెడుతుంది. మరునాడు శ్రీమతి హక్‌టక్ అదాటున ఆ గుండిగలో పడిపోయింది. దాంతో వాళ్ల సమస్యలు మొదలయ్యాయి...

# ప్రతిదీ రెండు-రెండు

**చైనా జానపద కథ**



అనగా, అనగా రోజుల్లో ఒక పూరిగుడిసెలో హక్‌టక్, అతని భార్య ఉండేవాళ్లు. వాళ్లు చాలా పేదవాళ్లు. వాళ్లకున్న కొంచెం నేలలో తమకు కావలసినది పండించుకునేవాళ్లు.





ఒక్కొక్కసారి పంట బాగా పండేది అప్పుడు హాక్‌టక్ ఊళ్లోకి వెళ్లి తమకు పండిన టర్నిప్, బంగాళదుంప, ఇతర కూరగాయలు ఇచ్చి తమకు కావలసిన బట్టలు, నూనె వంటివి తెచ్చుకునేవాడు.

ఒకసారి హక్‌టక్ తమ పొలంలో తవ్వుతుంటే అతడి పారకి ఠంగ్‌మంటూ ఏదో తగిలింది. అతడు అక్కడ జాగ్రత్తగా తవ్వాడు. అలా కొంచెంసేపు తవ్విన తరువాత అతడికి ఒక పాత గుండిగ దొరికింది.



‘ఇది చాలా వింతగా ఉంది. ఈ పొలంలో ఇన్ని సంవత్సరాలుగా పనిచేస్తున్నాను. ఇప్పటివరకు ఇది బయటపడనే లేదు! దీనిని ఇంటికి తీసుకెళతాను. నా భార్య దీనిని ఏదో ఒక రకంగా ఉపయోగించుకుంటుంది,’ అని అనుకున్నాడు.

ఆ పాత్ర చాలా పెద్దది. ముసలివాడైన హక్‌టక్ దాంతో కుస్తీ పడుతుండగా అతడి డబ్బుల సంచి కింద పడింది. దాంట్లో అయిదు నాణాలు ఉన్నాయి.





ఆ డబ్బు సంచిని గుండిగలో వేసి ఎంతో కష్టం మీద దానిని ఇంటికి తీసికెళ్లాడు.

గుడిసె దగ్గర ఉన్న అతడి భార్య, "భలే గుండిగ!" అంది. ఆ గుండిగ ఎలా దొరికిందో హక్‌టక్ ఆమెకు వివరించాడు. "ఇది మనకు ఎలా ఉపయోగపడుతుందో నాకు తెలియటం లేదు," అన్నాడు హక్‌టక్. "ఇది వంటకి పెద్దది, స్నానానికి చిన్నది."

శ్రమతి హక్‌టక్ ఆ గుండిగలోకి తొంగి చూసినప్పుడు ఆమెకి ఉన్న ఒకే ఒక్క పక్కపిన్ను అందులో పడిపోయింది. దాని కోసం ఆమె గుండిగలో చెయ్యి పెట్టి వెదికింది. అప్పుడు ఆమె గుండ్రని కళ్లు మెరిసాయి.



"చూడు!" అంటూ ఆమె అరిచింది. "ఈ గుండిగలోఒక్క పక్కపిన్ను రెండుగా అయ్యింది. రెండూ అచ్చంగా ఒకేలాగా ఉన్నాయి. అంతేకాదు ఇందులో రెండు డబ్బు సంచులు దొరికాయి, ఒక్కొక్క దానిలో అయిదేసి నాణాలు ఉన్నాయి!"



అది విన్న హక్‌టక్ సంతోషంతో గంతులు వెయ్యసాగాడు. "ఉండు, చలికాలంలో వేసుకునే నా కోటుని ఇందులో వేద్దాం. అది రెండు కోటులుగా మారితే నీకు కూడా చలి కాలంలో వెచ్చగా ఉంటుంది."

అతడు తన కోటు తీసుకొచ్చి గుండిగలో వేశాడు. దాంట్లోకి చూస్తే రెండు కోటులు ఉన్నాయి. ఆ మాయా పాత్రలో వెయ్యటానికి ఇంకా వాళ్ల ఇంట్లో ఏమేమి ఉన్నాయో వెదకసాగారు. "మన దగ్గర మాంసమో, తాజా పండో, ఒక్క తియ్యని మిఠాయో ఉంటే ఎంత బాగుండేది," అన్నాడు హక్‌టక్.

శ్రీమతి హక్‌టక్ నవ్వింది. “మనకి కావలసినవన్నీ ఎలా పొందాలో నాకు తెలిసింది,” అని ఆమె అంది. తన దగ్గర ఉన్న పది నాణాలను సంచిలో ఉంచి, దానిని ఆ మాయా గుండిగలో వేసింది. వెంటనే రెండు సంచులు అయ్యాయి, పది నాణాలు ఇరవైగా మారాయి.

“నువ్వు తెలివైనదానివి!” అంటూ భార్యని మెచ్చుకున్నాడు హక్‌టక్. “ఇలా చేసిన ప్రతిసారీ మన డబ్బులు రెట్టింపు అవుతాయి!” తరువాత డబ్బులను రెట్టింపు చేసే పనిని ఆ భార్యాభర్తలు మొదలుపెట్టారు. ఇప్పుడు డబ్బులతో పెద్ద మూటే నిండింది.



ఆ మరునాడు ఇంటికి కావలసిన సరుకుల జాబితాతో హక్‌టక్ బజారుకి బయలుదేరాడు. ఈసారి అతడి సంచిలో కూరగాయలకు బదులు డబ్బులు ఉన్నాయి. శ్రీమతి హక్‌టక్ ఇంటి పనంతా చేసుకుని వేడి తేనీరు తాగింది.

ఆ తరువాత మాయా రాగి గుండిగను ఆరాధనగా కౌగలించుకుని, “ఎక్కడినుంచి వచ్చావో తెలియదు కానీ నువ్వు నా ప్రియమైన నేస్తానివి,” అంటూ ఒంగి ఆ పాత్రలోకి చూడసాగింది.





అదే సమయానికి హక్‌టక్ చేతుల నిండా సరుకులతో తిరిగి వచ్చాడు. చేతులు ఖాళీ లేకపోవటంతో కాలితో తలుపుని తన్నాడు. ధడామ్! దాంతో అతడి భార్య అదిరి పడి, పట్టు తప్పి ఆ గుండిగలో పడిపోయింది! హక్‌టక్ పరిగెత్తుకుంటూ వెళ్లి భార్య కాళ్లు పట్టుకుని లాగాడు. గుండిగలో హక్‌టక్‌కి మరో రెండు కాళ్లు కనిపించాయి! అతడు ఆ కాళ్లను కూడా పట్టుకుని లాగాడు.

ఆ గుండిగ నుంచి మరొక స్త్రీ వచ్చింది. ఆమె చూడటానికి అచ్చం హక్‌టక్ భార్యలాగానే ఉంది.

కొత్త ఆమెనేల మీద కూర్చుండిపోయింది.
హక్‌టక్ అసలు భార్య ఏడ్వటం
మొదలుపెట్టింది. "చూడు! నేను నీ
ఏకైక భార్యని. ఆమెను వెంటనే ఆ
మాయా గుండిగలో పడేసెయ్యి!"
హక్‌టక్ కంగారుగా అరిచాడు,
"వద్దు! వద్దు! ఆమెను ఆ
పాత్రలో వేస్తే మరొక స్త్రీ వస్తుంది.
అప్పుడు మొత్తం ముగ్గురు
స్త్రీలవుతారు! కానీ నాకు ఒక్క భార్య
చాలు!" కోపంగా ఉన్న తన భార్య నుంచి
హక్‌టక్ ఒక అడుగు వెనక్కి వేశాడు.
అతడి కాలు తొట్రుపడి ఆ గుండిగలోకి
పడ్డాడు!





అప్పుడు ఆ ఇద్దరు ఆడవాళ్లు లేచి హక్‌టక్‌ని బయటకి తియ్యటానికి ప్రయత్నించారు. ఇద్దరూ చెరొక కాలు పట్టుకుని లాగసాగారు. అతడిని బయటకి తీసిన తరువాత కూడా గుండిగలో మరో రెండు కాళ్లు ఉన్నాయి! అప్పుడు రెండవ హక్‌టక్‌ని కూడా బయటకు లాగారు.



“ఈ రెండవ వ్యక్తిని ఇప్పుడు ఏం చేద్దాం!” అంటూ హక్‌టక్ అరిచాడు. “ఈ పాత్ర మనం అనుకున్నంత మంచిది ఏమీ కాదు. ఇప్పుడు మన కష్టాలన్నీ రెండింతలు అవుతున్నాయి!” హక్‌టక్ ఇలా అరుస్తూ ఉండగా అతడి భార్య ఆలోచిస్తూ ఉంది.



“కొంచెం శాంతంగా ఉండు,” ఆమె అంది. “రెండవ ఆమెకు భర్త దొరకటం మంచిదే అయ్యింది. మన రెండు జంటలూ మంచి స్నేహితులుగా ఉండవచ్చు. మన పోలికలు ఒకేలా ఉన్నాయి. అతడు నీకు తమ్ముడిగా, ఈమె నాకు చెల్లెలిగా ఉంటారు. ఈ పాత్ర నుంచి మనం వస్తువులను రెట్టింపు చేసుకోవచ్చు కాబట్టి మనకు దేనికీ కొరత ఉండదు.”



చివరికి వాళ్లు అలాగే చేశారు. ఒకే లాగా ఉండే రెండు అందమైన ఇళ్లు కట్టుకున్నారు. రెండు ఇళ్లల్లో ఒకే రకమైన పాత్రలు, సామగ్రి ఏర్పరచుకున్నారు.


బయటనుంచి ఆ రెండు
ఇళ్లూ ఒకే లాగా ఉండేవి. కానీ
వాటిల్లో ఒక తేడా ఉంది. ఒక
ఇంటిలో మాయా గుండిగ
దాచిపెట్టి ఉంది. ఇప్పుడు దాంట్లో
పడకుండా హక్‌టక్, అతడి భార్య
ఎంతో జాగ్రత్తగా ఉంటున్నారు!



కొత్త హక్‌టక్ దంపతులు, పాత హక్‌టక్ దంపతులు మంచి స్నేహితులయ్యారు. వాళ్లకి డబ్బు బాగా ఎక్కువై తమతో సహా అన్నిటినీ రెండేసి సమకూర్చుకున్నారని ఇరుగు, పొరుగు అనుకోసాగారు!

